# లారీ బేకర్



SHWETA SALUNKHE

శ్వేతా సాలుంఖే

నగేష్ మోనె

# లారీ బేకర్





डेक्कन एज्युकेशन सोसायटीचे
न्यू इंग्लिश स्कूल, टिळक रोड, पुणे ३०.



'अहम भारत' उपक्रमांतर्गत पुस्तिका®

Cadence Design Systems, Inc.
cādence®

# లారీ బేకర్



“నేను ధనిక, మధ్య తరగతి, పేద, లేదా గిరిజనులు, మత్స్యకారులు – ఇలా సమూహాలకు ఇళ్లు కట్టను. ఒక మాథ్యూ, ఒక భాస్కరన్, ఒక మునీర్ లేదా శంకరన్‌లకు ఇల్లు కడతాను.” – లారీ బేకర్

# లారీ బేకర్






"భారతదేశంలో భవన నిర్మాణంలో చెప్పుకోదగిన పని జరిగింది. భారతీయ భవన నిర్మాణానికి తనదైన ప్రత్యేక శైలి ఉంది. ఇక్కడ కనిపించేటంతటి వైవిధ్యత మరే దేశంలోనూ కనపడదు. ఈ గొప్ప వారసత్వం అంతరించిపోకుండా కాపాడుకోవాలి. భారతీయ భవన నిర్మాణ శైలిని ఉపయోగించి ఎన్నో కట్టడాలు కట్టి ఈ గొప్ప సాంప్రదాయాన్ని ముందుకు తీసుకుని వెళ్లాలి."

Laurie Baker

## లారీ బేకర్

లారెన్స్ విల్ఫ్రెడ్ బేకర్ ఇంగ్లాండులో 1917 మార్చి 2న పుట్టాడు. “లారీ బేకర్” అన్న పేరుతో అతడు మనందరికీ తెలుసు. సాంప్రదాయాలను కచ్చితంగా పాటించే కుటుంబంలో లారీ పుట్టాడు. చిన్ననాటి నుంచే లారీకి భవనాల పట్ల ఆసక్తి ఉండేది. 17 ఏళ్ల వయస్సులో తన సైకిల్ మీద యూరపును చూడాలని లారీ అనుకున్నాడు. ఆ యాత్రలో అతడు అందమైన నగరాలను, అద్భుతమైన ప్రకృతి దృశ్యాలను చూశాడు. వివిధ దేశాలలో రకరకాల నిర్మాణ శైలులను చూశాడు. యువ లారీపై ఇది ఎంతో ప్రభావం చూపింది. ఆ యాత్ర నుంచి తిరిగి వచ్చిన తరవాత భవన నిర్మాణ శాస్త్రాన్ని చదివి, ఆ రంగంలో పని చేయాలని లారీ నిర్ణయించుకున్నాడు.

## చదువు

పాఠశాల చదువు పూర్తి అయిన తరవాత లండన్‌లోని బిర్మింగ్‌హామ్ స్కూల్ ఆఫ్ ఆర్కిటెక్చర్‌లో లారీ చేరాడు. 1938లో రాయల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆర్కిటెక్చర్‌లో అసోసియేట్ అయ్యాడు. 1939లో రెండవ ప్రపంచ యుద్ధం మొదలుకావటంతో ఇంగ్లాండులో తన వృత్తిని కొనసాగించే అవకాశం దొరకలేదు. అది ఒక రకంగా మంచిదే అయ్యిందని అనుకోవాలి.

## "మిత్రుల" ఆంబులెన్స్

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో లారీ, అతడి మిత్రులు ఎఫ్ఎయు (ఫ్రండ్స్ ఆంబులెన్స్ యునిట్)లో తమ పేర్లను నమోదు చేసుకున్నారు. ఈ వాలంటీర్లకు అనెస్తీషియా ఇవ్వటం, చిన్నపాటి శస్త్రచికిత్సలు చేయటం, పట్టీలు వేయటం, ఇంజక్షన్లు చేయటం వంటి వాటిలో శిక్షణ ఇచ్చారు.



## చైనా-జపాన్ యుద్ధం

కొంత కాలానికి చైనా, జపాన్‌ల మధ్య యుద్ధం మొదలయ్యింది. గాయపడిన సైనికులకు వైద్యం చెయ్యటానికి ఫ్రండ్స్ ఆంబులెన్స్ యునిట్ సహాయాన్ని చైనా అడిగింది. ఈ వైద్య స్వచ్ఛంద సేవకులతో లారీ బేకర్ వెళ్లాడు.



ఇంగ్లాండు

మ్యాన్మార్

ముంబయి




మ్యాన్మార్‌లో గాయపడిన సైనికులకు లారీ బేకర్ కొంత కాలం సహాయం చేశాడు. కుష్టు రోగులకు కూడా సేవ చేశాడు. ఆ సమయంలో అతడు తన ఆరోగ్యాన్ని కూడా నిర్లక్ష్యం చేసి పని చేశాడు. దాంతో జబ్బుపడి ఇంగ్లాండుకి తిరిగి వెళ్లవలసి వచ్చింది. ఇంగ్లాండుకి వెళ్లే ఓడ కోసం ముంబయిలో మూడు నెలలపాటు వేచి ఉండాల్సి వచ్చింది. ఈ సమయంలో మహాత్మా గాంధీని కలిసే అవకాశం అతడికి దొరికింది. ప్రేమ, అహింసల గాంధీ సందేశం లారీ బేకర్‌ని ఎంతగానో ప్రభావితం చేసింది.

భారత దేశానికి తిరిగి రమ్మని బేకర్‌ని గాంధీ కోరాడు. మారుమూల గ్రామాలలో నివసించే లక్షలాది ప్రజలకు తక్కువ ఖర్చుతో ఇళ్లను రూపొందించగల బేకర్ లాంటి భవన నిర్మాణ శాస్త్రజ్ఞులు భారతే దేశానికి కావాలని గాంధీ చెప్పాడు. నిర్మాణం కోసం వాడే వస్తువులను స్థానికంగా, కడుతున్న ప్రదేశానికి 5 మైళ్ల పరిధి నుంచి సమకూర్చుకోవాలని సంభాషణ క్రమంలో గాంధీ చెప్పాడు.

# లారీ బేకర్ పెళ్లి

కుష్టు రోగులకు ఆసుపత్రులు రూపొందించటానికి 1945లో బేకర్ భారత దేశానికి లారీ తిరిగి వచ్చాడు. భారత దేశంలో అతడు తన మిత్రుడు డా. చండి దగ్గర ఉన్నాడు. అక్కడ అతడు డా. ఎలిజబెత్ జాకబ్‌ని కలుసుకున్నాడు. ఆమె వెల్లూరు క్రిస్టియన్ మెడికల్ కాలేజీ నుంచి పట్టా పొందింది.

బేకర్, ఎలిజబెత్ కలిసి చిన్న క్లినిక్‌ని ఆసుపత్రిగా మలిచారు. లారీ, ఎలిజబెత్‌ల జీవిత లక్ష్యాలు దాదాపు ఒకటిగానే ఉన్నాయి.

ఒక రోజు వాళ్లు ఇద్దరూ కూర్చుని మాట్లాడుకుంటూ ఉండగా తనని పెళ్లి చేసుకుంటావా అని ఎలిజబెత్‌ని లారీ అడిగాడు. కొంత కాలంగా అతడితో పని చేస్తూ ఉండటంతో అతడి ఆదర్శాలు, నెమ్మదైన స్వభావం ఎలిజబెత్‌కి తెలుసు. కాబట్టి వెంటనే ఎలిజబెత్ పెళ్లికి ఒప్పుకుంది. 1948లో లారీ, ఎలిజబెత్‌ల పెళ్లి అయ్యింది.



# హిమాలయాల్లో పదహారు సంవత్సరాలు

పెళ్లి చేసుకున్న వెంటనే లారీ బేకర్, ఎలిజబెత్‌లు హిమాలయాలలోని "చందగ్" అనే చిన్న ఊరిలో స్థిరపడ్డారు. పట్టా ఉన్న వైద్యురాలు ఉన్నారని తెలుసుకున్న ప్రజలు వైద్యం కోసం దూర ప్రాంతాల నుంచి, పెద్ద సంఖ్యలో రావటం మొదలుపెట్టారు. మొదటి ఆసుపత్రిని ఖాళీగా ఉన్న చిన్న టీ దుకాణంలో ఏర్పాటు చేశారు. తరవాత వాళ్లు తెరా అన్న ఊరికి మారారు. అక్కడ వాళ్లు తమ కోసం చిన్న ఇల్లు, ఒక ఆసుపత్రి కట్టారు.

ఒక్కొక్కసారి ప్రజలు బేకర్‌ని, "నువ్వు భవన నిర్మాణ నిపుణుడివి, ఆసుపత్రిలో ఏమ చేస్తున్నావు?" అని అడిగేవాళ్లు. అప్పుడు బేకర్ నవ్వేసి, "నా భార్య ఏకైక డాక్టరు, మిగిలిన సిబ్బంది అంతా నేనే!" అని చెప్పేవాడు.

ఉత్తర ప్రదేశ్‌లోని ఫైజాబాద్‌లో కుష్టు ఆసుపత్రిని కట్టడంలో లారీ బేకర్ సహాయపడ్డాడు.



## నిర్మాణంలో స్థానిక సాంకేతిక విజ్ఞానం

భారత దేశమంతా తిరిగి, భౌగోళిక వైవిధ్యతను చూసి ఇంగ్లాండ్‌లోని తన శిక్షణ ఇక్కడ అంతగా ఉపయోగపడదని లారీ బేకర్ గ్రహించాడు. దాంతో స్థానిక నిర్మాణ పద్ధతుల అధ్యయనాన్ని బేకర్ మొదలుపెట్టాడు. వాటినన్నింటినీ సమీకరించి, వర్గీకరించాడు. సాధారణ మేస్త్రులు, కూలీల నుంచి తక్కువ ఖర్చు అయ్యే స్థానిక వస్తువులను ఉపయోగించటం నేర్చుకున్నాడు. సాధారణ భారతీయుడి లాగా జీవించసాగాడు.

అనేక బడులు, ఆసుపత్రులు, సాంఘిక సేవా సంస్థలకు లారీ బేకర్ భవనాలు డిజైన్ చేసి, కట్టాడు. వీటిల్లో కొన్ని సంస్థలను తన సొంత డబ్బుతో నడిపాడు. ఆ విధంగా బేకర్ నిర్మాణ రంగంలోకి వచ్చాడు.






## కేరళ

కేరళలోని మారుమూల కొండలలోని 1963లో “వాగమాన్” అనే చిన్న గిరిజన గ్రామానికి లారీ బేకర్ కుటుంబంతో సహా మారాడు. కుష్టు రోగులకు ఆ ప్రాంతంలో కొన్ని ఆసుపత్రులను బేకర్ కట్టాడు. కొన్ని సంవత్సరాల తరవాత బేకర్ కుటుంబం తిరువనంతపురం వెళ్లి కుష్టు రోగులతో పని చెయ్యసాగింది. చివరికి వాళ్లు తిరువనంతపురంలో స్థిరపడ్డారు.

# ది హామ్లెట్

తిరువనంతపురానికి మారిన తరవాత సొంత ఇల్లు కట్టుకోటానికి బేకర్‌లు అర ఎకరం స్థలం కొన్నారు. అందమైన లోయ కనిపించే ఒక చిన్న గుట్ట మీద “ది హామ్లెట్” కట్టారు. భవన నిర్మాణ శాస్త్ర దృష్ట్యా వాళ్ల ఇల్లు ఒక అద్భుతమైన ప్రదర్శనశాల అని చెప్పుకోవచ్చు.

కూల్చేసిన పాత సాంప్రదాయ ఇళ్లనుంచి సేకరించిన వస్తువులతో తన ఇంటి వాలు పెంకు కప్పులు, ఒట్టి ఇటుక గోడలు, జాలీలు, తలుపులు, కిటికీలను లారీ బేకర్ కట్టాడు. కేరళలో మారుతున్న భవన నిర్మాణ ధోరణులను ఆ ఇల్లు తెలియచేస్తుంది.



## బేకర్ కృషి

క్రియాశీలంగా ఉన్న 40 ఏళ్ల కాలంలో బేకర్ ఎన్నో భవనాలు కట్టాడు. హిమాలయాలలో అతడు చేసిన పని గురించి ఎవరికీ అంతగా తెలియదు. కానీ తిరువనంతపురంలో స్థిరపడిన తరవాత తక్కువ ఖర్చుతో ఎన్నో నిర్మాణాలకు రూపకల్పన చేసి, కట్టాడు. తిరువనంతపురంలో వేలాది సాధారణ ప్రజలకు అతడు ఇళ్లు కట్టాడు. క్రైస్తవ ప్రార్థన మందిరాలు, బడులు, సామూహిక భవనాలు కూడా కట్టాడు. వీటన్నిటిలో అతడు స్థానిక పద్ధతులను, తక్కువ ఖర్చు నిర్మాణ వస్తువులను ఉపయోగించటం మొదలుపెట్టాడు. అతడు కట్టిన అన్ని భవనాలలో ఈ రెండు అంశాలు కొట్టొచ్చినట్టు కనపడతాయి.









## లారీ బేకర్ మాటల్లో...

"ప్రజల అవసరాలలో చాలా వాటికి స్థానిక భవన నిర్మాణ శాస్త్రంలో సమాధానాలు దొరుకుతాయని నేను గమనించాను. మీరు ఏ జిల్లాకి వెళ్ళినా అంతకు ముందు వరకు చాలా మంది సొంతంగా తమ ఇళ్లను కట్టుకున్నారని తెలుస్తుంది. అయితే, కాలక్రమంలో ప్రజలు ఈ నైపుణ్యాలను కోల్పోయారు. అందుకే ఇల్లు కట్టడానికి వాళ్లకి బయటివాళ్ల సహాయం అవసరం అవుతోంది."

"లక్షలాది ప్రజల ఇళ్ల సమస్య గురించి లోతుగా ఆలోచించిన ఏకైక భారతీయ నాయకుడు గాంధీ. 'ఊళ్లల్లో కట్టే ఇళ్లకు కావలసిన వస్తువులు అయిదు మైళ్ల పరిధిలోంచి రావాలి,' అన్న గాంధీ మాటలు నాకు ఎంతో నచ్చాయి. ఈ ఆలోచన నా పనిని ఎంతగానో ప్రభావితం చేసింది."

"భారత దేశం వంటి పేద దేశంలో డబ్బులు, శక్తి, విలువైన వనరులను వృధా చేసే హక్కు మనకు లేదు."

"తోటి భవన నిర్మాణ శాస్త్రజ్ఞుల నుంచి నేర్చుకున్నదానికంటే ఎక్కువగా సాధారణ మేస్త్రులు, నిర్మాణ కూలీల నుంచి నేర్చుకున్నాను."

"తక్కువ ఖర్చు నిర్మాణాలు పేదవాళ్ల కోసమేనన్న ఆలోచన సరైనది కాదు. తక్కువ ఖర్చు అంటే నాసిగా కట్టటం కాదు, సౌకర్యాలు లోపించటం కాదు. పేదరికానికి పెద్ద పీట వేసి పొగడ కూడదు."



# లారీ బేకర్

## జీవన క్రమం

భారత ఆర్కిటెక్చర్‌కి లారీ బేకర్ ఎంతో చేశాడు. వ్యక్తిగత, వృత్తిపర జీవితాల మధ్య అతడు చక్కని సయోధ్య సాధించాడు. దీనివల్ల అతడు వృత్తిలో ఎంతో నాణ్యతను ప్రదర్శించగలిగేవాడు. అతడి ఆదర్శాలు, ఆచరణ, అద్భుతమైన వ్యక్తిగత లక్షణాలు ఎందరికో స్ఫూర్తిగా నిలిచాయి.
లారీ బేకర్ జీవితం, పని అనుసరణీయమైనది. “భూగోళం వేడెక్కటం” రీత్యా “కార్బన్ ఫుట్ ప్రింట్ తక్కువగా ఉండే ఇళ్ల” నిర్మాణం ఆవశ్యకత పెరిగింది.

1917: జననం

1938: రాయల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆర్కిటెక్ట్స్ అసోసియేట్

1981: నెదర్‌లాండ్స్ రాయల్ విశ్వవిద్యాలయం ద్వారా డి.లిట్.తో సత్కారం

1987: జాతీయ గృహనిర్మాణ బోర్డు అవార్డు ప్రకటించిన మొదటి సంవత్సరంలో అందుకున్నాడు

1988: భారత పౌరసత్వం పొందాడు

1990: భారత ప్రభుత్వం ద్వారా పద్మశ్రీ

1992: ఐక్యరాజ్య సమితి నుంచి హాబిటాట్ అవార్డు, హాబిటాట్ రోల్ ఆఫ్ హానర్

1993: తక్కువ ఖర్చు భవన నిర్మాణ డిజైన్లకు సర్ రాబర్ట్ మాథ్యూ బహుమానం

1994: పీపుల్ ఆఫ్ ది ఇయర్ బహుమానం

1995: లండన్ విశ్వవిద్యాలయం నుంచి గౌరవ డాక్టరేట్ పట్టా

1998: శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి గౌరవ డాక్టరేట్ పట్టా

2006: ప్రిట్జ్‌కర్ ఆర్కిటెక్చర్ బహుమానానికి నామినేట్ అయ్యాడు

2007: 90వ ఏట చనిపోయాడు

# లారీ బేకర్

"ఇటుకలను చూసినప్పుడు నాకు మానవ ముఖాలు గుర్తుకు వస్తాయి. అన్నీ ఇటుకలు మట్టితో, బట్టీలో కాల్చి చేస్తారు. కానీ ప్రతీ ఇటుక మరోదానికంటే కొంచెం తేడాగా ఉంటుంది. ప్రతిదానికి కొంచెం భిన్నమైన ఆకారం ఉంటుంది. ప్రతి రాయికీ తనదైన ప్రత్యేక రంగు, రూపు ఉంటాయి.
అందుకే నేను ఇటుక గోడలకు ప్లాస్టరింగ్ చేయటం ఇష్టపడను. ప్లాస్టరింగ్ కృత్రిమమైనది, వృధా ఖర్చు. ప్లాస్టరింగ్ చేయటం వల్ల ఇటుకలకు ఉన్న వ్యక్తిత్వాన్ని చంపేస్తాం! ఖర్చు పెరగటమే కాకుండా ప్లాస్టరింగ్ వల్ల ఇల్లు అంద వికారంగా మారుతుంది."

- లారీ



# లారీ బేకర్

భారతదేశ ముఖ్యమైన ఆర్కిటెక్ట్‌లలో లారీ బేకర్ ఒకడు. నిర్మాణంలో స్థానికంగా అందుబాటులో ఉండే వస్తువులు, తక్కువ ఖర్చుకు అతడు దారి వేశాడు. అది ప్రభుత్వ భవనమైనా, ప్రైవేటు భవనమైనా, కార్యాలయమైనా, వ్యక్తిగత నివాసమైనా బేకర్ ఎప్పుడూ ఖర్చు తగ్గించటానికి ప్రయత్నించేవాడు. తక్కువ శక్తి వనరులను వాడుతూ పర్యావరణ హితమైన భవనాలను అందరికీ అందుబాటులో ఉండేలా కట్టడాన్ని బేకర్ పద్ధతిగా చెప్పుకోవచ్చు.

లారీ బేకర్ 1917లో ఇంగ్లాండులో పుట్టాడు. అతడు 2007లో భారతదేశంలో చనిపోయాడు. నిండు తొంబై ఏళ్లు జీవించాడు. పూర్తిసమయం ఆర్కిటెక్ట్ పనిని అతడు 50 ఏళ్ల వయస్సులో ప్రారంభించాడు. బర్మింగ్‌హామ్ విశ్వవిద్యాలయంలో అతడు ఆర్కిటెక్చర్ చదివాడు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో చైనాలో అంబులెన్స్ డ్రైవరుగా పనిచేశాడు. చైనా నుంచి ఇంగ్లాండుకి తిరిగి వెళుతున్నప్పుడు ఓడ కోసం ముంబయిలో కొన్ని నెలలు వేచి ఉండాల్సి వచ్చింది. ఆ సమయంలో మహాత్మా గాంధీని బేకర్ కలిశాడు. బేకర్ సొంతంగా తయారుచేసుకున్న చెప్పులు గాంధీని వెంటనే ఆకర్షించాయి. అతడి పనితనాన్ని గాంధీ మెచ్చుకున్నాడు. "భారత దేశానికి నీలాంటి తెలివైన దార్శనికుల అవసరం ఉంది. ఇళ్ల నిర్మాణంలో స్థానిక వస్తువులు, డిజైన్లు, నైపుణ్యాలను ఉపయోగించుకోవాలి. సాధ్యమైనంతవరకు నిర్మాణ స్థలానికి 5 మైళ్ల పరిధిలోంచే నిర్మాణ వస్తువులను సమకూర్చుకోవాలి," అని అతడితో గాంధీ చెప్పాడు.

కొన్ని సంవత్సరాల తరవాత లారీ బేకర్ భారత దేశానికి తిరిగి వచ్చాడు. ఇక్కడ అతడు కుష్టు రోగులకు ఆసుపత్రులు, తక్కువ ఖర్చు ఇళ్లు, ప్రజా భవనాలు కట్టాడు. 1948లో అతడు డా. ఎలిజబెత్ జాకబ్‌ని పెళ్లి చేసుకున్నాడు. ఆ తరవాత దంపతులు పిథోర్‌గఢ్ వెళ్లారు. అక్కడ వాళ్లు ఒక ఆసుపత్రి నడిపారు. అందులో ఎలిజబెత్ ఏకైక డాక్టరు, మిగిలిన సహాయకుల పనులన్నీ బేకర్ ఒక్కడే చేసేవాడు! అమెరికా విద్యావేత్త వెల్తీ ఫిషర్ స్థాపించిన *"లిటరసీ హౌజ్"* బేకర్ కట్టిన మొదటి ప్రజా భవనం. లక్నోలో మానసిక రోగులకు *"నూర్ మంజిల్"* అనే భవనానికి బేకర్ డిజైన్ తయారుచేశాడు.



బర్మింగ్‌హామ్ స్కూల్ ఆఫ్ ఆర్కిటెక్చర్

లారీ బేకర్ క్వేకర్ల తాత్వికత కలవాడు. మత మౌఢ్యం, ఆధిపత్యాలకు వ్యతిరేకంగా క్వేకర్లు ఎప్పుడూ పోరాడేవాళ్లు, మత తీవ్రవాదాన్ని ప్రశ్నించేవాళ్లు. నిరాడంబరత, శాంతిని కోరుకునేవాళ్లు. ఒక రకంగా గాంధీ ఆలోచనా విధానాలకు క్వేకర్లు దగ్గరగా ఉండేవాళ్లు. 1947లో క్వేకర్లు నోబెల్ శాంతి బహుమతిని పొందారు.

చిన్న వయస్సులోనే బేకర్ డబ్బు విలువ, నిరాడంబరతలను నేర్చుకున్నాడు. చిన్నప్పుడు తనకు ఇచ్చిన డబ్బుతో బిస్కెట్లు కొనుక్కునేవాడు. పూర్తి బిస్కెటు బదులు విరిగిపోయిన ముక్కలైతే అదే డబ్బుకి రెట్టింపు వస్తాయని త్వరలో అతడు తెలుసుకున్నాడు. విరిగిపోయిన బిస్కెట్లు కూడా అంతే రుచిగా ఉండేవి! ఈ పాఠం అతడు ఎప్పుడూ మరిచిపోలేదు.



1960లలో బేకర్ తన భార్య రాష్ట్రమైన కేరళకి తిరిగి వచ్చి తిరువనంతపురంలో స్థిరపడ్డాడు. యాభై ఏళ్ల వయస్సులో పూర్తిసమయం భవన నిర్మాణ పని మొదలుపెట్టాడు. భారతీయ సాంప్రదాయ వృత్తికారుల పద్ధతిలో బేకర్ భవన డిజైన్-నిర్మాణ పనిని చేపట్టాడు. అతడికి కార్యాలయం లేదు, సహాయకుడిని ఎప్పుడూ పెట్టుకోలేదు. భవనాల ప్లానులను తరచు చిత్తు కాగితాల మీద వేసేవాడు, ఎక్కువగా నిర్మాణ స్థలంలోనే డిజైన్ చేసేవాడు. అతడి ప్రాజెక్టులను ఇంజినీర్లు కాకుండా అతడు శిక్షణ ఇచ్చిన పనివాళ్ల బృందాలు అమలు చేసేవి. మధ్యన ఎవరూ లేకుండా అతడే స్వయంగా రంగంలో ఉండటం వల్ల ఖర్చులు చాలా తక్కువగా ఉండేవి. పర్యావరణం పట్ల అతడికి ఉన్న సున్నితత్వం వల్ల అతడు స్టీలు, సిమెంటు చాలా తక్కువ వాడేవాడు. “సిమెంటు నేను పుట్టిన తరవాత వచ్చింది. స్థానిక వస్తువులతో చేసిన ఇళ్లల్లో ప్రజలు శతాబ్దాలుగా ఉంటున్నారు,” అని అతడు ఎప్పుడూ చెబుతుండేవాడు.



నిర్మాణ స్థలాన్ని బేకర్ తరచు సందర్శించేవాడు. ఒకసారి ఒక మేస్త్రి మీద అతడికి బాగా కోపం వచ్చి చెడామడా తిట్టేశాడు. ఇంటికి తిరిగివచ్చిన తరవాత తప్పు చేశానని బేకర్‌కి అనిపించింది. వెంటనే క్షమించమంటూ ఆ మేస్త్రికి ఉత్తరం రాశాడు.

“మా తల్లిదండ్రులు ఆదివారాలు ఆడుకోనిచ్చేవాళ్లు కాదు. మా అన్నయ్య నాకంటే పదేళ్లు పెద్దవాడు. ఈ నియంతృత్వ నియమం అతడికి నచ్చలేదు. అతడు చాలా అల్లరివాడు కూడా! చడీ చప్పుడు లేకుండా మా అన్నయ్య ఇంట్లోంచి జారుకుని ఈతకి వెళ్లేవాడు, టెన్నిస్ ఆడేవాడు! అతడి ధైర్యం నాకు నచ్చేది. అతడు నా హీరో! మనం మంచి విషయాలను పాటించాలి, పిచ్చివాటిని వ్యతిరేకించాలి. మా అన్నయ్య నాకు ఈ పాఠం నేర్పించాడు.”

– లారీ

సాధారణ పనివాళ్లు కూడా అర్థం చేసుకునేలా భవన ప్రణాళికలు, బొమ్మలు వేసేవాడు. తరచు కవర్ల వెనక, శుభలేఖల వెనక వీటిని గీసేవాడు. కేరళలో చాలా సంవత్సరాలు ఉన్నప్పటికీ అతడికి మళయాళం ధారాళంగా రాదు. నీళ్లు, రేపు, నిర్మాణ వస్తువులు, ఒకటి, రెండు వంటి కొన్ని మళయాళ పదాలు మాత్రమే అతడికి వచ్చు. అయితే అతడికి హిందీ బాగా వచ్చు. భారత పౌరసత్వం కోసం అతడు చేసుకున్న ధరకాస్తు చాలాకాలం ప్రభుత్వం దగ్గర ఉంది. చివరికి అతడికి 1988లో భారత పౌరసత్వాన్ని ఇచ్చారు. అప్పటివరకు అతడు ప్రతి మూడు నెలలకు ఒకసారి పోలీసు స్టేషనుకి వెళ్లి తన వివరాలను రిజిస్టరులో రాయవలసి వచ్చేది.

శక్తిని (ఎనర్జీని) సమర్థంగా వినియోగించటంలో వేల సంవత్సరాలపాటు తప్పులు చేస్తూ, సరిదిద్దుకుంటూ సాగిన పరిశోధన సాంప్రదాయ భవన నిర్మాణ శాస్త్రంలో ప్రతిఫలించటం బేకర్ మొదట హిమాలయాలలో చూశాడు. తమ ఇంటికి కొన్ని వందల గజాలలో దొరికే స్థానిక రాళ్లను, కలపను ఉపయోగించేవాళ్లు. నిర్మాణ స్థలానికి 5 మైళ్ల పరిధిలోంచి తెచ్చిన వస్తువులతోనే ఇళ్లను కట్టాలన్న గాంధీ మాటలను ఇది గుర్తు చేసేది. బేకర్ ఆ సూత్రాన్ని ఎల్లవేళలా పాటించలేకపోయేవాడు, కానీ దానికి చాలా దగ్గరగా వచ్చాడు. శక్తిని ఎక్కువగా వినియోగించే గ్లాస్, ఉక్కులను అతడు ఎంతమాత్రం ఇష్టపడేవాడు కాదు. అయితే కెలియడొస్కోపిక్ కాంతి ప్రభావం కోసం గోడలలో రంగు సీసాలను ఉపయోగించటం ఇష్టపడేవాడు. ఇటుకలను ఇష్టపడేవాడు, వాటిని గోడలలో రాట్-ట్రాప్ పద్ధతిలో వాడి 25 శాతం ఇటుకలను ఆదాచేయటమే కాకుండా లోపల వేడెక్కకుండా చేసేవాడు. అతడి ఇటుక జాలీలు (గోడలో ఖాళీలు) బయటినుంచి చల్లని గాలిని లోపలికి రానిచ్చేవి, పైకప్పులో ఉండే రంధ్రాల నుండి వేడి గాలి బయటకు పోయేది. సిమెంటుకి బదులు సున్నం వాడేవాడు. స్టీల్ బదులు స్లాబులలో వెదురు బద్దలు వాడేవాడు, దీనితో ఖర్చు అయిదోవంతుకి పడిపోయేది. గ్రామీణ ప్రాంతాలలో పెద్ద పెద్ద యంత్రాలు ఉండేవి కావు. స్థానికంగా దొరికే రాళ్లు, మట్టి, కలపతో గ్రామీణ ప్రజలు తమ చేతులతో ఇళ్లను కట్టుకోవటం బేకర్ చూశాడు. గ్రామీణ ఇళ్లు పర్యావరణ హితంగా ఉండటమే కాకుండా అందంగా ఉండటం బేకర్‌ని ఆశ్చర్యపరిచేది.

"కట్టబోయే ఇంట్లో ఉండేవాళ్ల వివరాలు అన్నింటినీ సేకరిస్తాను. వంట ఎలా వండుకుంటారు? ఏమి తింటారు? వంటరిగా తింటారా, కుటుంబం అంతా కలసి తింటారా? వాళ్ల పడక గది ఎలా ఉంటుంది? పని చేసుకోటానికి, కుట్టుకోటానికి, చదువుకోటానికి వాళ్లకి ఎటువంటి సదుపాయాలు ఉన్నాయి? ఇలాంటి చిన్న చిన్న విషయాల గురించి ఆలోచిస్తూ ఎక్కువ సమయం గడుపుతాను." – లారీ




బడి చదువులో లారీ అంత ముందు ఉండేవాడు కాదు. కానీ బొమ్మలు వేయటమంటే చాలా ఆసక్తి ఉండేది. బడి చదువు పూర్తి అయిన తరవాత స్నేహితుడి సలహా మీద ఆర్కిటెక్చర్ కళాశాలలో ప్రవేశానికి ధరకాస్తు చేసుకున్నాడు. బేకర్ వేసిన బొమ్మలు బాగా నచ్చటంతో ప్రిన్సిపల్ అతడిని చేర్చుకున్నాడు. కళాశాలలో అతడు అందంగా వేయటం నేర్చుకున్నాడు. శిల్పకళ, మట్టితో పని చేయటం, సెరామిక్స్, సంగీతం కూడా అతడు నేర్చుకున్నాడు. అతడి భవిష్యత్తు పనికి ఇది బలమైన పునాదిగా నిలిచింది.

ఒకసారి గృహనిర్మాణం మీద సెమినార్‌కి లారీ బేకర్‌ని ఢిల్లీ పిలిచారు. అక్కడ "పేదలకు ఇళ్లు" అన్న అంశంపై చర్చించనున్నారు. అది 5-స్టార్ హోటల్‌లో జరగనున్నది. దానికి హాజరు కాలేనని బేకర్ సున్నితంగా తిరస్కరించాడు. తన విమాన ప్రయాణం, హోటల్ ఖర్చుతో ఒక పేద కుటుంబానికి ఇల్లు కట్టవచ్చు!
ఇదే విషయం అతడు సెమినార్ నిర్వాహకులకు రాశాడు. దానికి వెళ్లటానికి బదులు భవన నిర్మాణ ఖర్చులు తగ్గించుకునే విధానాలపై బొమ్మలు వేసి, చేతితో రాసిన పుస్తకాన్ని బేకర్ పంపించాడు. ఈ పుస్తకాన్ని తరవాత "కాస్ట్‌ఫోర్డ్" అనే సంస్థ ప్రచురించింది.

A MANUAL OF COST CUTS FOR STRONG ACCEPTABLE HOUSING

సాంప్రదాయ భవనాలను బేకర్ బాగా అధ్యయనం చేసి, విస్తారంగా నోట్స్ తయారు చేసుకున్నాడు. సాంప్రదాయ నిర్మాణాలలో చాలావరకు పర్యావరణ హితంగా ఉండి, కాల పరీక్షకు నిలబడ్డాయి. కొత్త డిజైన్లకు బేకర్‌కి అవి కొత్త దృష్టికోణాన్ని ఇచ్చాయి. సౌకర్యవంతమైన ఇళ్లు కట్టడానికి వందల సంవత్సరాలుగా ఉన్న సాంప్రదాయ వస్తువులు, నైపుణ్యాలు, డిజైన్లను బేకర్ వాడుకున్నాడు. 'ఆర్కిటెక్చర్ చాలా ముఖ్యమైనదని, దానిని ఆర్కిటెక్ట్‌లకు వదిలెయ్యకూడదని' అతను నమ్మేవాడు. ఎవరికివారు సొంతంగా చేసుకునేలా అతడు స్వయంగా బొమ్మలు వేసి *భవనాల ఖర్చు తగ్గించటం ఎలా? రబ్బిష్, మట్టి* వంటి డజను దాకా చిన్న పుస్తకాలు రాశాడు. అతడు కట్టిన భవనాలలో *సెంటర్ ఫర్ డెవలప్‌మెంట్ స్టడీస్* (సిడిఎస్), తిరువనంతపురం బస్ స్టాండ్ వద్ద ఉన్న *కాఫీ హౌస్* బాగా ప్రచారం పొందాయి. తాను కట్టిన భవనాలు కేరళలోని కొబ్బరి చెట్ల కంటే ఎత్తు ఉండకూడదని అతడు అనుకునేవాడు! క్లిష్ట పరిస్థితుల్లో కూడా హాస్యప్రియుడైన బేకర్ సున్నితమైన, తేలికైన పరిష్కారాలు కనుగొనేవాడు.
గుజరాత్, ఉత్తర ప్రదేశ్, పశ్చిమ బెంగాల్‌లలో బేకర్ కట్టిన భవనాలు కేరళలో కట్టిన వాటికంటే చాలా భిన్నంగా ఉండేవి. గుజరాత్‌లోని "బేకర్ శైలి" కేరళలోని "బేకర్ శైలికి" ఎంతో తేడా ఉండేది.

"గ్రామాలలో పేద ప్రజలు తమ ఇళ్లను సొంతంగా కట్టుకోవటం చూశాను. వాళ్ల అందమైన ఇళ్లల్లో కొత్త వస్తువులను వాడటం చూశాను. సాధారణ వస్తువులైన రాయి, మట్టి, వెదురు, ఎండుగడ్డి వంటివాటితో అందంగా ఉండే గోడలను తయారుచేసే వాళ్ల నైపుణ్యం నన్ను అబ్బురపరిచింది!"

– లారీ








సౌరశక్తితో నడిచే ఎడ్ల బండి
(లారీ బేకర్ వేసిన కార్టూన్)

చాలా మంది నిపుణులు బేకర్ విధానాన్ని తీవ్రంగా విమర్శించేవాళ్లు. అయితే, తనని విమర్శించేవాళ్లకి సమాధానాలు చెబుతూ బేకర్ ఎప్పుడూ సమయం వృధా చేసేవాడు కాదు. అందుకు బదులుగా సాధారణ ప్రజలకు తక్కువ ఖర్చుతో అందమైన ఇళ్లను కట్టడానికి తన శక్తులను కేంద్రీకరించేవాడు. పడిపోతున్న సామాజిక ప్రమాణాలను అతడు అనేక వ్యాసాలలో విమర్శించాడు. నిరసన తెలియచేయడానికి ప్రత్యామ్నాయ విధానాలను కూడా అతడు చూపించాడు.

లారీ ఆర్కిటెక్ట్ మాత్రమే కాడు. అతడు జీవితాన్ని పరిపూర్ణంగా జీవించాడు – వివిధ సందర్భాలలో అతడు అనీస్తటిస్ట్. మిషనరీ, తోటమాలి, వంటవాడు, రైతు, పశువుల డాక్టరు, ఆంబులెన్స్ డ్రైవర్, వడ్రంగి, మేస్త్రి, కవి, కార్టూనిస్ట్ వంటి పాత్రలు పోషించాడు. నిరాడంబరతతో పరిపూర్ణ జీవితాన్ని ఎలా గడపవచ్చో బేకర్ తన కార్టూన్లలో చూపించాడు. బేకర్ ఎంతో కష్టపడేవాడు, ఆర్తితో జీవించేవాడు. 1988 దాకా అతడికి భారత పౌరసత్వం ఇవ్వలేదు. కానీ గాంధీని కలిసిన మరుక్షణం అతడు భారతీయుడైపోయాడు!

బేకర్‌కి చాలా గౌరవ డాక్టరేట్లు వచ్చాయి. బ్రిటిష్ ప్రభుత్వం అతడిని ఆర్డర్ ఆఫ్ ది బ్రిటిష్ ఎంపైర్, ఎంబిఇలతో సన్మానించింది. ఐక్యరాజ్య సమితి హాబిటాట్ అవార్డు ప్రకటించిన తొలి సంవత్సరమే దానిని అందుకున్నాడు. 1990లో అతడికి పద్మశ్రీ పురస్కారం లభించింది. ఎలిజబెత్, బేకర్‌లు ముగ్గురు పిల్లలను దత్తత తీసుకున్నారు – కొడుకు తిలక్, కూతుళ్లు విద్య, హైడీ. భారత దేశాన్ని బేకర్ ఎంతగానో ప్రేమించాడు.

తొంభై ఏళ్ల పండు వయస్సులో 2007 ఏప్రిల్ ఫూల్ రోజున లారీ బేకర్ తన ఇంట్లో చనిపోయాడు. మరణంలో సైతం తన విమర్శకులపై పైచేయి సాధించాడు.

సగం ఇటుక కావాలా?

అయితే, పూర్తి ఇటుకను ఎందుకు పగలకొడుతున్నారు? ఇలా చెయ్యటం వల్ల డబ్బు, సమయం, ఇంధనం వృథా అవుతాయి.



కిందకి చూడండి. అక్కడినుంచి సగం ఇటుకను అందుకుని పని కొనసాగించండి.






ఈ ఇంటిని ఇటుకలు, మట్టితో కట్టారు. ఇది పలు అంతస్తుల భవనం. కొబ్బరి చెట్ల వల్ల ఇది చల్లగా ఉంటుంది



ఈ ఇంటిని ఇటుకలు, మట్టితో కట్టారు. ఇది అందంగా లేదూ?

భారత దేశంలో 2 కోట్ల మందికి సొంత ఇల్లు లేదు. గృహ రంగంలో పని చేస్తున్న వాళ్లు దీని గురించి ఆలోచించాలి. తక్కువ ఖర్చుతో, అందమైన ఇళ్లు కట్టటానికి వాళ్లు దోహదం చేయాలి. ఇది సామాన్య ప్రజల అవసరం. దీనిని తీర్చగలం. అయితే దీనికి ప్రత్యామ్నాయ దృక్పథం అవసరం. వ్యర్థ నీటిని మనం తిరిగి వినియోగించాలి. ప్రజలలో అధిక శాతానికి మౌలిక వసతులు కూడా అందుబాటులో లేవు. వాళ్లకి సహాయపడాలని మనకి నిజంగా ఉంటే మనం మన ఆలోచనా విధానాన్ని మార్చుకోవాలి. అప్పుడు మనం చేపట్టే పరిష్కార మార్గాలు భిన్నంగా ఉంటాయి.

ఇటుకలతో గోడ కట్టి సిమెంటుతో ప్లాస్టర్ చేస్తాం. తరవాత ప్లాస్టర్‌లో దీర్ఘచతురస్రాలతో ఇటుకల లాగా డిజైన్ గీసి, వాటికి ఎర్ర రంగు వేస్తాం! ఇంతకంటే పిచ్చి పని మరొకటి ఉంటుందా! మనకి పేంటింగ్ అంటే ఇష్టం ఉంటే దానిని గోడకి వేలాడదీస్తాం, లేదా ఒక ప్రత్యేక ప్రదేశంలో ఉంచుతాం. వాటిని చూడాలనుకునేవాళ్లు వాటి దగ్గరకి వెళ్లాలి. కానీ, ఇళ్లు, భవనాలతో అలా కాదు, మనం బయటకు వెళ్లినప్పుడల్లా వాటిని చూస్తాం. సాధారణ ప్రజలు వాటిని చూసి ఆనందించేలా భవనాలను అందంగా రూపొందించటం ఆర్కిటెక్ట్ పని.



చాలా భారతీయ ఇళ్ళల్లో నేను జాలీలు (గోడలో కంతలు) చూశాను. నా డిజైన్‌ని ఇది ప్రభావితం చేసింది, నా పనిలో దీనిని ఉపయోగించుకున్నాను. జాలీల వల్ల భవనాలు అందంగా ఉండటమే కాకుండా ఖర్చు కూడా తగ్గుతుంది. గోడలో జాలీలు చల్లని గాలి లోపలికి వచ్చేలా చేస్తాయి, పైకప్పులో ఉండే కంతలలోంచి వేడి గాలి బయటకు వెళుతుంది. వేసవిలో ఎండలు తీవ్రంగా ఉన్నప్పుడు వీచే వేడి గాలులు ఇబ్బందికరంగా ఉండవచ్చు. తలుపులు, కిటికీల పైన అడ్డంగా లింటెల్ స్లాబు బదులు ఇటుకలతో అర్ధ వృత్తాకారంలో కమానులు చెయ్యవచ్చు. ఇవి చాలా ధృఢంగా ఉంటాయి! ద్వారానికి, కిటికీలకి చట్రాలు ఉపయోగించటం కూడా నాకు నచ్చదు. ఎటువంటి చట్రాలు లేకుండా నేను చాలా ఇళ్లు కట్టాను.

లక్షలాది భారతీయులకు మౌలిక సదుపాయాలు అందుబాటులో లేవు. చాలా ఇళ్లకు గచ్చు, పైకప్పు, తలుపులు, కిటికీలు ఉండవు. తరచు రెండు కుటుంబాలు ఒకే ఇంటిలో ఉండాల్సి వస్తుంది. అటువంటప్పుడు పిల్లలు ప్రశాంతంగా చదువుకోగలరా? మనం ఆకాశహార్మ్యాలను, పెద్ద పెద్ద దుకాణాలను, ఏర్ కండిషన్డ్ సినిమా హాళ్లను, నదుల మీద పెద్ద వంతెనలను కడతాం, కానీ పేద ప్రజల మౌలిక సదుపాయాలను విస్మరిస్తాం. ప్రజల ఉత్పాదక సామర్ధ్యం వాళ్ల ఇళ్లు, పరిసరాలతో ముడిపడి ఉంటుంది.



కొంతమంది హిందూ, ముస్లిం స్నేహితుల గురించి తెలుసుకున్న తరవాత వాళ్లు నిజమైన క్రైస్తవులని నాకు అనిపించింది. వాళ్లు నాకంటే మంచి క్రైస్తవులు! హింస అన్నది అత్యంత ద్వేషించదగ్గ లక్షణమని నా 80 ఏళ్ల జీవితంలో అనిపించింది. సాధారణ ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను మతం, దేశం, కులం వంటి పేర్లతో జరిగే హింస ఏమాత్రం పరిష్కరించలేదు. ప్రేమ, సౌభ్రాతృత్వం ఈ సమస్యలను తప్పకుండా పరిష్కరించగలవు. ఇతరుల పట్ల ప్రేమే అసలైన మతం!

లారీ బేకర్ ఇళ్ల డిజైన్‌కి చాలా తక్కువ రుసుం తీసుకునేవాడు. అది మేస్త్రీ కూలీతో సమానంగా ఉండేది! "ఏకకాలంలో రెండు, మూడు ఇళ్లకు పనిచేస్తాను కాబట్టి నాకు సరిపడా సంపాదిస్తాను! భారతదేశాన్ని నేను పుట్టిన దేశం దోచుకుంది. దానిని తిరిగి చెల్లించటం నాకు సాధ్యం కాదు. వాస్తవానికి నేను ఎటువంటి రుసుమూ తీసుకోకూడదు. కానీ, నేను కొంచెం ఆశపోతును!"

నిర్మాణంలో అత్యంత ఎత్తు, అత్యంత కింద ప్రదేశం ఏది వంటివాటికి ప్రాధాన్యత ఇస్తాను. చిన్న పొదలు, చెట్లు ఎక్కడ ఉన్నాయి? పెంపుడు జంతువులు ఎక్కడ ఉంటాయి? వాన, గాలి ఏ దిశలో వస్తాయి? ఈ అంశాలను నా డిజైన్‌లో పొందుపరుస్తాను. నేను రూపొందించే ఇళ్లల్లో ఉండబోయే మనుషుల గురించి నేను ఎప్పుడూ ఆలోచిస్తాను.





1990లో
భారత ప్రభుత్వం
లారీ బేకర్‌కి
**పద్మశ్రీ**
ప్రదానం చేసింది.




9 Every building should be UNIQUE. No two people, or families etc are alike, so why should their houses all be the same?

10 DONT ROB NATIONAL RESOURCES & do not use them ~~extravagantly~~ or ~~unnecessarily~~.

11 Be HONEST & TRUTHFUL in design & material usage, construction, costs, & about your own mistakes!

12 AVOID OPULANCE & 'SHOWING-OFF', and dont use currently fashionable gimmicks.

13 Get your CONSCIENCE out of deep-freeze & USE it. Let ALL YOU DO be honest & truthful – not only yr buildings.

14 Look closely at YOUR OWN PREJUDICES. Question them and see if they are still justifiable!

15 HAVE FAITH IN YOUR OWN CONVICTIONS & have courage to stick to them — but respect those of other people.

16 Make COST-EFFICIENCY your WAY OF LIFE – not merely "Low Cost for the Poor". Practice what you preach.

20 TRIM your drawings, staff, equipment, travel & transport, paper, & expenses.

(MY FEELINGS ABOUT BEING AN ARCHITECT!) Laurie Baker

